వాణీ కావ్యమాల
తృతీయపుష్పము

ప్రథమ ముద్రణము 500 కాపీలు — 1951.
రాయల ముద్రణాలయము, తెనాలి,

# ప్రవేశిక

వెనుకటి నాళ్ళ సాధారణముగా పల్లెటూళ్ళలోని శిష్ట కుటుంబాలవారు తెలుగులో చక్కని సాహిత్య జ్ఞానము కలిగి భారత భాగవతాది మహాకావ్యములు పఠించు చుండెడివారు. వారు తరంతరాల నేదో కృషి నవలంబించియు నీ సాహిత్య పరిజ్ఞానమునుగూడ తరంతరాల కందించెడివారు. కొందఱు సుకృతమువలన కవులై కావ్యగానము చేయుటకూడ కద్దు. రసజ్ఞులైన గ్రామీణులు వారి నాదరించి సన్మానించుట పరిపాటి. ఈ స్థితికి తెచ్చుటకు బడులులేవు, పరీక్షలులేవు ప్రాంతీయుడైన గురుబోధమాధారము చేసుకొని పండితులైన వారు కొందఱు, కొద్ది చదువునేనేర్చి స్వయంకృషితో పెంపొందిన వారు మఱికొందఱు.

ఈ సౌభాగ్యము విదేశీయపాలనలో, నాంగ్ల విద్యా ప్రాబల్యములో క్షీణించినది. అక్కడక్కడ చిన్నెలు మాత్రము తొంటి సాంఘిక జీవిత సంస్కృతిని స్ఫురణకు దెచ్చుచున్నవి.

ఈ గ్రంథ రచయిత శ్రీ పెన్మెత్స రాజంరాజుగారిది శిష్ట క్షత్రియకుటుంబము. పశ్చిమగోదావరీ మండలమునందలి తాడేపల్లిగూడెం తాలూకాలోగల చోడవరగ్రామము నివాసము.

అనూచానముగ గర్షకులు. వీరి నాయనమ్మగారు నైషధము వఱకు సంస్కృతము చదివిరట. తండ్రి తెనుగున మంచి పాండితి కలవారట. ఆ కోవకుచెందిన యీ రచయిత పిన్ననాటనే ప్రాథమిక విద్యతో బడి విడచినను తెలుగు కావ్యములు చదివి మంచి భాషాజ్ఞానము సంపాదించినారు. అంతియకాదు, పుణ్యవిశేషమున గవిత్వమలవడి కావ్యములు రచింప మొదలిడినారు. అట్లు రచించిన ఖండకావ్యముల సంపుటమే యీ చిత్రవాణి! గ్రామమున కర్షకుడై స్వయంకృషితో నింతటి కవనమల్లుట కొనియాడదగినది.

ప్రథమప్రయత్నములైన యీ ఖండకావ్యములు చదివిన వారికి రెండు విషయములు వెంటనే స్ఫురించును. ఒకటి వీరికిగల దేశభక్తి. ఇదిచాల ఖండికలలో స్వదేశముమీదనో, స్వరాష్ట్రముమీదనో వెల్లడియగుచుండును. దేశచరిత్రలోని మేలిమిని పలుతావుల స్పృశించినారు. రెండవది ప్రకృతి వర్ణనం. జానపదములోని కృషీవలుడేమో! వీరికి ప్రకృతిని నిత్యము గాంచెడి యవకాశముకలదు. ఆచాయలు భావనలోనికి రాక మానవు.

భావనతో పద్యములు చెప్పవలెనన్న యత్నము చాల చోట్ల కనబడును. క్రమముగా భాషలో జిగి హెచ్చినకొలది, రచనలో చేయితిరిగినకొలది, జీవితానుభవములు పెరిగినకొలది; ఈయత్నములు విరివిగా ఫలించును. శయ్యలో మార్దవము, రచనలో వేగము ద్యోతకమగుచుండును. క్రమశః యీమేల్మి గుణములు భాసింపగలవు.

"ఝల్లుమనె నా బాలగుండెలు
ఘల్లుమనె మంజీరయుగళము
మల్లెపూబాలికలు సైతము
తెల్ల పోయినవి"
"చల్లని పిల్లవాయువులు సాగుచుబోయిలతాగృహాలలో
మల్లియపూల బాలికలమానసవీధుల కేళిసల్పె"...
"పడమటికొండ నిన్ బ్రణయంబునన్ బెంచి
దీవించి తూర్పుగా తెరవు చూప"...

ఇటువంటి పంక్తులు భావనాబలముకలిగి, మనోహరములై వీరు సుకవులై వన్నెగాంతురని విదితము చేయుచున్నవి.

ఉన్నత పాఠశాలలు కళాశాలలుగాక గ్రామములలో జాతికిజీవగఱ్ఱగానున్న కర్షక కార్మికుల యిండ్లలో సాంప్రదాయముగ సాహితీ దీపములు వెలిగిననాడే! జాతి తొంటివైభవము చేకొన్నదని చెప్పవచ్చును.

ఈ యువకకవి దీక్షతో కృషినెఱపి ఉన్నతాశయములుగల సుందర కావ్యములను రచించునని విశ్వసించుచున్నాను.

రాజోలు. } ఇట్లు,
8—3—51 } కందుకూరి రామభద్రరావు.

# విషయసూచిక

మదీయ జనకులు

శ్రీ వెంకట నరసింహరాజుగారికి

భక్తితాత్పర్యములతో

సమర్పితము.

నడచిపోయిన యిరువదినాలుగేండ్ల
జీవితమునందు విమల విద్యావివేక
లతలు నన లెత్తసాకిన చతురు; నాదు
జనకు పాదాంతికమున, నంజలిఘటించి 1

ఏనర్పింపదలంచితిన్ ముదముతో
యేణీవిలోలాక్షి, నిన్
ధ్యానమ్మొందిడి, మామకీనరచనా
ధారాభిషేకమ్ము ని
త్యానూనమ్ముగ తావకీనమగు పా
దాబ్జమ్ములన్నిల్పి, ఓ
వాణీ! నాకవనమ్ము సాకగదె? ది
వ్యంబౌ కృపాదృష్టితో 2

# చిత్రావళి

## భరతమాత

ఊహాకందని ముద్దు కోహి నూర్వజ్రంబు
పోవగావనరని "ధీవిశాల"
ముంతాజిలో జగన్మోహనంబై యొప్పు
శిల్పంబుతో నాడు "చిగురుఁబోఁడి"
భాగీరధీ సింధు బ్రహ్మ పుత్రల ప్రాణ
సఖులగా వడసిన "సద్గుణాఢ్య"
వసుధలోపల శాంతి వాహినుల్ పాఱించి
స్థిరకీర్తిఁ గాంచిన "ధీరచిత్త"
అపర దేశజులకు నన్నవస్త్రము లిచ్చి
ప్రాణ భిక్షలిడిన "పావనాత్మ"
తనదు సేవ కొఱకు తనువు రాల్చిన వీర
వరులఁగాంచి మురిసియు భరతమాత!

# బుద్ధదేవుఁడు

పాపవారాశిలోఁబడి ప్రాణికోటి
వెతలు పడువేళ దరిఁజేర్చి ధృతిని మోక్ష
సిద్ధి నరచేతఁ బెట్టిన బుద్ధదేవ!
కరుణతోఁ గొమ్ము నా నమస్కారశతము. 1

భవదీయోజ్జ్వల బోధచంద్రికల నాస్వాదించుచున్ భూతముల్
భవపాశమ్ములఁ బాసి మోదజలధిన్ భాసిల్లె, నీ గుండెలో
నవసెన్ నింద్యపు ఘోరహింస, పరమామ్నాయమ్ములన్మించు నీ
నవబోధామృతవృష్టి, యార్పిచనె నన్నా! మాదుకర్మాగ్నులన్ 2

అరయన్ లోకహితార్థివై, విభవ భార్యాపుత్రులన్ వీడి, భీ
కర వన్యస్తపమాచరింపుచు, జగత్కళ్యాణమున్ గోరు నీ
స్థిరచిత్తమ్మున నాటిపోయిన కృపాస్నిగ్ధైక దృగ్వీథిలో
ధరణీధ్రమ్ములు లీనమైకరఁగె, పూతమ్మయ్యె ముల్లోకముల్ 3

ఇరువదియైదువందల పయింబడి యేండ్లు గతించిపోయియున్
పరువము వాయ దింతయు భవద్వచనమ్ము, వియత్పథమ్ములో
మెఱయుచు తారకారుచుల మించెను, నీచరణమ్ము సోకి మా
భరతసవిత్రి! గుండెదడ బాసి సుఖించెనుగా మహాత్మకా! 4

## భారతీయుఁడా!

వికసితపాటలాబ్జమున వేకువజామున రోచిరున్నతిన్
ప్రకటిత రాగసంపదలు పల్లవులారెను తూర్పు కొండపై
సుకవిమనమ్మునందుగల సున్నిత భావములో యనంగ, నీ
వికనయనాంబుజాతము నదేటికి! విప్పవు భారతీయుఁడా? 1

ఒకయెడ మారణాస్త్రతతు లుద్భవమంది మహోగ్ర వైఖరిన్
ప్రకృతికిఁ గల్గు శాంతిసటు భస్మముచేయఁ దలంపు చుండ నీ
యకలుషశాంత జీవితము, హాయిగఁ జెల్లునటంచు నమ్మి, యి
ట్లొక తెరచాటు నందిమిడి యుండుట చెల్లునె? భారతీయుఁడా! 2

భూరి బహ్వాఢ్యలంచిత విభూతిపరుల్ విభుదైకసన్నుతుల్
భారతవీరకేసరులు భవ్యయశస్కు లటంచు మ్రోసెగా
పేరిపుడట్టివారు కనుపింపమికిన్ దగుహేతు వీవె! నీ
కూరుకుమాసిపోను, తరుకోటరమందొక పక్షి వైతివా? 3

పురిటి బెబ్బులి కంటిపౌరకహింసను నేర్పు
చిరునవ్వు మోవిపై చిందులాడ
సర్వసర్వంసహా చక్రిమే యుప్పొంగి
సామ్యవాదాబ్ధిలో జలకమాడ
బరిమార్పయే తెంచు పగవాని గుండెలో
భ్రాతృభావము లేచి పఱువులెత్త

మంటలు మిన్నంట మహినేర్చు మారణా
　　　　స్త్రములు రాట్నముఁగాంచి జడిసి పాఱ
అమలినోన్నత భావమ్ములలర "గాంధి"
దేవుఁడెరిగించిపోయిన తెరువునందు
క్రాంతి రథమెక్కి విశ్వవిశ్రాంతి కొఱకు
పాటుపడ వేగలేవోయి! భరత పుత్ర!!

పరువెత్తిరోయి! నీప్రాచీన రాజన్య
　　　　బాహుశక్తినిఁగన్న వైరి నృపులు
వినుతించిరోయి! నీ ఘన యశశ్చంద్రికల్
　　　　పాహియానాదులౌ భవ్యమతులు
వెదచల్లిరోయి! నీవేదాంత సారమ్ము
　　　　శంకర రామాది సాధు జనులు
ధన్యులైరోయి! నీ ధరణీ పరాగమ్ము
　　　　సోకిన పరదేశ శూరవరులు
చకితులైరోయి! నీ కళాచాతురిఁ గని
అఖిలదేశాల వార లహో యటంచు
నేఁడు నీ నిద్ర చాలించి పాడువడిన
చిరతరఖ్యాతి వెలయింపు భరతపుత్ర!



# శాంతి జ్యోతి

అదిమె; నిరతమ్ము గగనసౌధాంగణమున
భవ్యమైనట్టి తారకా పథమునందు
కలుషరాహిత్యమగు నవ్య కాంతితోడ
దాంతి కిరవై వెలింగెడు శాంతిజోతి 1

అమ్మహాజ్యోతి యుగములెన్నైన జనిన
నాఱిపోవదు లేశము మాఱిపోవ
దందు లయమైన దివ్యమహాత్వమెన్న
తరముకాదార పండితోత్తములకైన 2

పుట్టెనల్లజ్యోతి బుద్ధదేవునిదృష్టి
నంతక్రమమువిూఱ నలముకొనియె
నక్కజముగ మేని చిక్కనౌ రుధిరమ్ము
పోసెనందు పిదప యేసుప్రభువు 3

ఆమహాజ్యోతినే యాధారముగఁగొని
ధరణిచక్రము సదా తిరుగుచుండు
ఆమహాజ్యోతియం దైక్యమై ముక్తిపొందు
ప్రీతిహోత్రుఁడు వెల్గు హేతులెగయు
ఆమహాజ్యోతి తన్ననునయింపుచునుండ
కూపారమవని పై కురికిరాదు

ఆమహాజ్యోతి కేహానిగల్గకయుండ
శ్వసనుండు తగురీతి సంచరించు
అదిమె; ప్రాణికోటికాధారమైపెల్లు
పరిజ్వరిల్లుచుండు ప్రతిదినంబు
అరయ మొన్న మొన్న భరతభాగ్యవిధాత !
గాంధిదేవుఁ డంచె ! కలసిపోమె ! 3

---

## కో కి ల

మునుపొకనాఁడు నీ యమరమోహనగానసుధాప్రహదమ్ములో
నను పులకింపఁజేసిన వనప్రియ, పూజ్య వియత్తరంగిణీ
జనితనిసర్గరమ్యతరసంపదఁదేలినధన్యురాల !, నీ
ఘనతరదేశయాత్ర వినఁ గౌతుకమయ్యెడినేమొ ! కోకిలా! 1

జననమునందినావు, సురసంస్తవనీయ, యశోవిశాలయౌ
తెనుఁగుసవిత్రిగర్భమునఁ, దీయనిగానము నీ ధనంబయై
తనరగ, భారతావని నితాంతపరిశాంతయుతమ్ము కాంచగా
చని కనివచ్చినావు, మదినమ్మతిలన్ వివరింపు కోకిలా ! 2

శరవేగంబుననీ వం
బరవీధినిపట్టిపోవు పట్టునపికమా ?
అరుదైన వింతలెన్నియొ
పరికించితివెయుండుగాదె? పరిమదమ్మెనగన్ 3

మలమల కూడుగుడ్డలకుమాడి కృశించుచు దీనవృత్తితో
మెలగెడు మందభాగ్యులు సమీపము చేరిన నీసడించుచున్
మిలమిలలాడు క్రొమ్మెసిమిమేనులతోడ, తొలంగు బుద్ధిమం
తుల,కఠినోక్తులం జెవుల దూర్పకు మెయ్యెడనున్ బికోత్తమా! 4

తన సాటిమానవుల్ తిన తిండిలేకేడ్వ
కని కననట్లుగా చనెడువారు
తన దేశజులు వస్త్ర ధారణ కల్లాడ
చలువదుస్తులు దాల్చి కులుకువారు
తన సోదరులకుండ ధామమే కఱవైన
నపరంజిమేడలం దలరువారు
తన వారు జీవనాధారమ్ముకనకున్న
ధనరాసులనుపాతి దాచువారు
ధనికులై దీన బాంధవత్వమ్ము విడచి
కృపణవర్గంపుటార్తోక్తు లింత వినక
గుండెతడిలేని మధురసూక్తులువచించు
ఘనులకంటివె? యితరలోకములయందు 5

లోభచిత్తు లపరలోకాలలో నేడు
వెదకుచున్నవారె విత్తమునకు
వెదుకఁగానరాని విద్యుల్లతలుపూని
పుడమికడుపు చీల్చగడగినారె? 6

బాగుగమెక్కి లేతలిరుపాన్పులఁబండి సతమ్ము హాయిగా
భోగవిలాసతత్పరతఁ బ్రొద్దులుపుచ్చు మహాత్ములెందరో!
వాగుచు కూటికై మొగము వాచి, తపించెడు దీనఘోషలో
దాగుడుమూతలాడుట—యదార్థముగాకనుగొంటె? కోకిలా! 7

విధివిరామమ్ము లెన్నక మధుర భావ
మిళిత హృదయమ్ముతో సదా! మేనువంచి
కష్టపడుచుండు కార్మిక కర్షకాళి
గతిని కనువారుకలరె? జగమ్మునందు 8

రోయ నసహ్యమైన చెడురోగములుండుట కాటపట్టు లీ
కాయము, లిందుకై నరులు కైదువులూని పరస్పరమ్ముగా
కోయుచునుంద్రు కుత్తుకలు ఘోరరణస్థలులందు నిప్పుడో
కోయిల! కాంచినావె? కనుగొల్కులనీరము చిందిపారగన్ 9

అఖిలభారతజాతి నైకమత్యమ్ముతో
మతవివాదమ్ములు మఱుపుఁడనుచు
మానవనీతిలో మసిబొచ్చెములు పెంచు
అంటుమారిని పట్టి గెంటుఁడనుచు
అర్థతృష్ణావార్ధి నరికట్టి యింకించి
సమదృష్టి లోకాన చాటుఁడనుచు
భూరివిలాసైక భోగమత్తత వీడి
జాతీయవృత్తులు సాకుఁడనుచు

దీనజనసేవ భారతదేశసేవ
సలుపుచుండుట నరజన్మ ఫలమటంచు
మొఱలుపెట్టిన నేత మా ముసలితాత
కానవచ్చెనె? నాకలోకమ్మునందు. 10

అతఁడు మహాతపస్వి, సదయాత్ముఁడు శాంతధనుండు వానిలో
సతత మహింసరోచులు - ప్రసన్నములై మహిఁ దేజరిల్లు న
ద్భుతముగ, భావి భారతవిభూతికి రేఖలు దిద్దినట్టి యా
చతురు, భజించినావె? మతిసక్త మహాత్తరభక్తిఁ గోకిలా! 11

సుప్తభారతజాతి శూన్యాంతరంగాల
    చీకట్లు బాపిన లోకహితుఁడు
అనివార్యశౌర్య సత్యాగ్రహాజికి దోత్ర
    దారితీసినయట్టి తత్త్వవేత్త
ఆర్తరక్షణదీక్ష నలరారి తనువెల్ల
    ధారపోసి వెలుంగు సారగుణుఁడు
విశ్వ విశ్రాంతికై వెలలేని తన ప్రాణ
    ముల బలింజేసిన పుణ్యమూర్తి
భరత జనయిత్రి సమ్మోదవార్ధిఁ దేల
దాస్యముడిగించినట్టి యుదారచరితుఁ
డట్టిమహితాత్ము దివ్యపాదాబ్జరజము
మౌళిపై దాల్చినావె? నిర్మలచరిత్ర! 12

పరలోకమ్మున నీవు కీర్తనలకున్ బాత్రంబవై లేచి, యి
ద్ధర కేతేరఁ దలంపుచున్ మది వియన్మార్గమ్మునన్వచ్చుచో
భరతోర్వీస్థలి కంగరత్నయననా ప్రాలేయధామమ్ము, న
గ్గిరిరాజేంద్రుని గాంచినావె? చెపుమా! గీర్వాణగానమ్ముతో 13

ఆకొండయందు వాహ్యాళిసల్పెడు కాము
బూదిఁగావించె మున్ భూతవిభుఁడు
ఆకొండపై ప్రమోదాత్ముడై యప్సరో
గానమ్ము విను వేయికనుల వేల్పు
ఆకొండ యందె తన్నడ్డు వరూధిని
న్నిరసించిపోయె నా ధరణిసురుఁడు
ఆకొండలోయలందాటపాటలు నేర్చి
కడలినిచేరు గంగాభవాని

అమ్మహానగాగ్రి మరయనేగిన మహా
ధీరవరుల పరువుజారిపోయె.
నందువెలయు ప్రకృతినాత్మ నూహయొనర్చి
వాసిఁగాంచె కాళిదాసుకవి 14

ఆరమణీయశైలరమ నారసినీవు, ప్రఫుల్లదృష్టితో
వారిదవీధివెంబడిని వచ్చెడిచో కనినావె? సొంపువెం
పారగనొప్పు నక్కపిలవస్తుపుర మ్మలరోహిణీనదీ
తీరమునందు, శాక్యనృపు తేజము చాటుచునుండునే కదా! 15

ఏమహనీయునోట జనియించిన సూక్తిసుధారసమ్ములో
సీమలుపుల్కరించెను, నశించెనుహింస, చరాచరమ్ములు
ద్దామమహాప్రమోదజలధామమున న్గను తేలగాంచె, నీ
వా మహనీయ బుద్ధనిలయమ్మును, కాంచి తరించితే! పికా? 16

పసిబాలుడై తల్లి పరలోకమున కేగ
కాంచి లోలోన యోజించునాఁడు
శరహస్తుడై నారి సారింపఁగని పాటు
హరిణార్తి కండ్లార నరయునాఁడు
చెలికాడు నిర్దయచిత్తుడై కూల్చిన
కలహంస రుధిరమ్ము కాంచునాఁడు
రోగి వృద్ధశవ కురూపులం బొడగాంచి
క్లేశమ్ముచే ధృతి కెడయునాఁడు
పొంగిపొరలెడు వేదనాంబోధిమునిగి
కరుణరసబీజములు సర్వధరణినాటి
విశ్వకళ్యాణపథము చూపించినట్టి
బుద్ధభగవానుగొల్చితే పుణ్యరాసి! 17

ఆయనకన్గొనన్ బొడమినట్టి యహింస, కసాయిగుండెనే!
తీయనిబోధచే కరఁగఁదీసెనుజుమ్మ, రసాతలమ్ములో
పాయనివేడ్క నిష్ఠకనుపట్టెడు నమ్మహనీయుచిత్రముల్
దీయగఁడంగు ధీరుల నుతింపగ చే! నిరతమ్ము కోకిలా! 18

ధీరనుతుండు, మౌర్యజలధిన్ బ్రభవించిన పూర్ణచంద్రుఁ డా
దారుఁడు, విశ్వకంటకవిదారుఁడు, మేరుగభీరధైర్యవి
స్ఫారుఁ డశోకు డాతని, విశాలమునశ్శిల చెక్కఁబడ్డదై
చేరిన బౌద్ధతత్త్వము, నశింపగలేదు! యదార్థమోపికా! 19

కరమనురక్తితోడ దశకంఠవిలుంఠనుఁడైన రామభూ
వరు నిలయమ్మయోధ్య కని వ్రాలితివా కొక్కఁ!, ప్రహృష్టచిత్తవై
సరసిజమిత్రవంశ నృపసాంద్ర యశోహ్రదమట్లుపాఱు నా
సరయువు నందు క్రుంకులిడసాగితివే? మనసారకోకిలా! 20

భూరిపరాక్రమోన్నత విభూతిదలిర్ప నపారసేనతో
భారతదేశమున్ గెలువ పైకొనుకోర్కుల చేరగన్న యూ
ధీరు, సికిందరున్ గెలిచి దివ్యపరాక్రముఁడైనయట్టి మా
వీరుఁడు, పూరుషోత్తముఁడు వేడుకనేలిన నేలకంటివే? 21

రజనీశవంశ సమ్రాట్టులేలినవేళ
మోదాబ్ధి తేలిన ముద్దరాలు!
పలుమారు రసపుత్ర బాహువల్లరులందు
విహరించిమించిన విద్రుమోష్ఠి!
మొగలాయినృపతుల పగడాలమేడలో
కులికి నవ్వినయట్టి కలికిమిన్న!
మొనమొన్న యింగ్లండు జనసభ్యతను కొంత
చవిచూచియున్న నిశ్చలచరిత్రి!

ఖండఖండాంతరాల విఖ్యాతిఁగాంచి
హాళి వెలుగొందు ఢిల్లీసమాఖ్యనగరి
గారవమ్మున నీవు చెంగటికిఁజేర
బుజ్జగింపుచు నేమనె? పులుగుచెలియ 22

ఢిల్లీ గాయకబృందమంతయును పోటీచేసి నీకోడెనా?
అల్లాభక్తుఁ డజాదు, జవ్వారుఁడు నిన్నాశీర్వదింపంగ, యూ
వల్లాభాయిపటేల్ శెబాసనియెనా? ప్రాంచన్మదమ్మొప్ప లాల్
ఖిల్లా కంటివె? యక్బరాదుల యశఃకేంద్రమ్మదే! కోకిలా! 23

వారలు గొప్పగొప్ప నయవాదులటంచుఁదలంచి మొన్న మా
వారలు, ఆంధ్రరాష్ట్రము విభాగముచేయుడటంచు నర్థిమై
కోరగ సమ్మతించి యిదిగో! యదిగో! యనిత్రిప్పిత్రిప్పి, యే
సారములేని తీర్పులు విషాదము తోపగఁ దేల్చిగోపికా! 24

క్రమమున దేశమాతకు సుఖమ్ము ఘటిల్లిన మీదనైన మా
శ్రమఁదిలకింతురంచు నరుసమ్మున నమ్మిన తెన్గువారి సం
భ్రమమడుగంటెనయ్యొ! పరిపాలన చేయుచునున్న పెద్దల
క్రమమగు తీర్పుదిద్దిన జగమ్మున ధర్మము నిల్వజాలునే? 25

ఆకాశమ్మున మేఘవారువము లందారూఢవై మెల్లగా
భూకంపమ్మున క్రుంగిపోయిన యసామున్ గాంచి కన్నీటితో
లోకస్తుత్యుని గాంధిదేవునిసుడుల్ లోలోన చింతించుచున్
పాకిస్తానున వ్రాలినావె చెపుమా? భద్రమ్ముగా కోకిలా! 26

దూరయానమ్ముచే నీవు తొలుత కొంత
అలసటం జెంది యొక్కచో నాగి ముందు
బడలికలువాసి యందందు పాడువేళ
నరసి నీ దివ్యగానమ్ము నాలకించి 27

ప్రోగుగా చుట్టు మూగెడు లీగు వారు
మతముపేరిట సోదర మమతవీడి
మాటిమాటికి హైందవ మతముమీద
కాలుఁద్రువ్వుటయెంత దుఃఖాస్పదంబు 28

గుడి గోపురములెల్ల పడగొట్టుకొనిపోయి
గజనీ మహమ్మదే ఘనతకెక్కె
సత్యదూరంబైన సమరమ్ము సాగించి
గోరీ మహమ్మదే పేరుగాంచె
భరతఖండము రక్తపాతమ్ము కావించి
పంగుతైమూ రేమి బాగుపడియె
తనక్రోధవహ్నిలో మన హైందవుల వ్రేల్చి
ఔరంగజే బేమి యనుభవించె

అంతవరకేల నే; మనచెంత మొన్న
మిడిసిపడినట్టి నైజాము మ్లేచ్ఛనేత !
కలుషచిత్తుండు రజ్వీ యేగతినిఁ బొందె
ననుచు తలపరె! నేడైన మనములందు 29

హిందూముస్లిము సోదరు
లందరికొక దైవమనుచు నవిరళ శాంతిన్
పొందుపరుప నీ వాడిన
సందేశం బాలకించి సమ్మతి వడిరే? 30

తలుపంబోరొక్కొ అక్బరోత్తముండు తొల్లి
ఏకథాటిగ యీదేశ మేలు నపుడు
భారతీయులతో ద్వేషపడిన యెడల
స్వీయగౌరవమెల్ల నశించుననుట 31

భరత జనయిత్రి! మొగలుల బారిఁజిక్కి
వెతలుపడు వేళ కాపాడ ధృతినిపోరి
రాణకెక్కిన రసపుత్ర రాజ్యములను
అరసి యేతెంచుచో కంటె? హాల్దిఘాటు 32

కానన్ కూటికి గుడ్డకై వగచి బల్కష్టాల పాలయ్యెయున్
మేనంబ్రాణములుండగా యవనభూమీపాలు సేవింపఁగా
రానంచున్ శపథమ్ము సల్పిన, మహారాణాప్రతాపుండు ము
న్నానందమ్మున చేరియుండె పదునారబ్దమ్ము లచ్చోటనే! 33

కోరికలూర పోయి కనుగొంటివటే! మన ఝాన్సిరాణి—వి
స్ఫారపరాక్రమమ్ము వెదచల్లి వెలింగిన పుణ్యసీమ యం
దారని కీర్తిచంద్రికల, నయ్యవియెంతటి మబ్బులడ్డిన
న్గూరుకుచెంద కెల్లపు డనూనకళం జెలువారు, కోకిలా! 34

అతిభక్తితో జిజియాబాయి తనతొలి
బామున నోచిన నోముపంట
చతురుఁడౌ మారాటి సర్దారు షాహాజీ
పడయగాంచిన ప్రాక్తపఃఫలమ్ము
హైందవ విద్వేషి నౌరంగజేబుని
సల్లాడఁజేసిన యగ్గిపిడుగు
ఆర్తరక్షణ దీక్షనలరి జీవితమెల్ల
వ్యయమొనర్చిన మహా త్యాగధనుఁడు
ఖాండదేవుని హితబోధ గుండెలందు
బాదుకొల్పిన లోకైక బంధువనగ
ప్రణుతికెక్కినయట్టి శివాజినేత !
పుట్టి పెరిగిన భూములు మెట్టి నావె ? 35

వీరులు తెన్గుబిడ్డలు పదింబదిపోయి వినమ్రచిత్తులై
కోరిన, 'నాంధ్రరాష్ట్రమునకుం దగరిప్పుడు మీరు పొండు' అ
న్నారట హైకమాండున *ఘనాఘన మేమి గ్రహించియుండిరో!
వారల చిత్తవృత్తులు భవాదృశులైన గ్రహింపలేరటే ? 36

విశ్వవిఖ్యాత భారత వీరమాతృ
సేవలందేలి నిర్మల చిత్తులైన
ఆంధ్రపుత్రుల వీరవిహార చరిత
మెంచి చూడరు వార లొక్కించుకైన 37

---

* యదార్థము

బ్రతికినన్నాళ్లాంధ్రి భారతిసేవకై
వెచ్చించె తనువెల్ల "విశ్వదాత"
అపరఖండాలయం దర్శింపబడి తెన్గు
ద్యుతివెల్గ కేరడే! "దుగ్గిరాల"
ఆంగ్లేయవిశ్వవిద్యాలయపీఠిపై
సాక్షాత్కరింపడే! "సర్వేపల్లి"
మరతుపాకికి గుండె చరచి గర్జించుచు
భంగమ్మునొందెనే! "టంగుటూరి"
వారువీరంచు నీకడ వాగనేల
గోచిపెట్టిన యే తెన్గుకుఱ్ఱడైన
భరతజనయిత్రిసేవకై! పాటుపడమి
నరసిచూపింపఁగలవటే? పరభృతమ్మ 38

స్త్రీజాతి కెనలేని సేవఁజేసిన మహా
కవిచక్రవర్తి! మా "కందుకూరి"
ఆంధ్రిభాషాయోష! నల్లారుముద్దుగా
కులికించిమించె మా "చిలకమర్తి"
సామంతభూమీశ! సత్సభాస్థలులందు
జయభేరిమ్రోయించె "చళ్లపిళ్ల"
అవధానిపంచాననంబై చరించె కా
కర్లకొండలరాయ కవివరుండు
కానగారాడె! యాస్థాన కవిగనేఁడు
చారుతరమూర్తి! మా "కవి సార్వభౌమ"

ఇట్టి మేధావులెందరో పుట్టిపెరిగి
భవ్యతరకీర్తి ! గాంచరే ? పరభృతమ్మ 39

తెనుఁగుతల్లికి నూత్న తేజమ్ముఁ వెలయించి
కూరుచున్నాడె ! "కాటూరిసుకవి"
వెలలేనితనవ్య విధులకిన్నెరమోఁగ
విహరింపుచుండడే ! "విశ్వనాథ"
ప్రతిలేనిజాతీయ పథమందుకనరాడె!
ధీవిశాలుండు "మల్లావధాని"
కరుణాస్నావంతులేకమునఁగపాటింపడే !
నెయ్యంబుమీఱ "పాపయ్యశాస్త్రి"
అడవి నండూరి జాషువా యాదిగాఁగ
లట్టికవులెల్ల నడుములు కట్టినేఁడు
నవ్యసాహిత్యసీమల నడచుచుండ
ఆంధ్రరాష్ట్రమ్ము పొంద నర్హతయులేదె ? 40

దూరపుకొండలు నునుపని
పేరిడగాలేదె? మున్ను పెద్దలు, యిక నీ
పేరాశవిడచి యస్మ
ద్ధారుణి విడనాడిపోఁవఁదగునే! పికమా ! 41

పిచ్చిభావాలకెల్ల తావిచ్చి హృదిని
స్వీయమిత్రుల విడనాడిపోవుటేల ?

తెనుఁగు బిడ్డల విఖ్యాతిఁ దెలుపునట్టి
గీతలంబాడు నీజన్మ పూతమాను 42

అరవగణపతి కుండాళ్ళ నప్పగించి
ఎవ్వరడ్డినఁ జేకొందు మింకజయము
చేరి తీరును రాష్ట్రలక్ష్మీలలామ
రమ్ము పోవుద మిదె ! స్వాగతమ్ము సంగ 43

---

## గౌ త మి

పడమటికొండ నిన్బ్రణయంబునన్ బెంచి
దీవించి తూర్పుగా తెరవుఁజూప
మార్గమ్మునందు సన్మానించి లాలించు
సెలయేటిచేడియల్ బలసికొలువ
కూలవీధులసదా! కేళిసల్పుచునుండు
పక్షిసంతతులెల్ల ప్రస్తుతింప
లలిఁ దరంగములు సల్లాపమ్ములాడుచుఁ
బవనాహతినిఁదూలిపడుచు నాడ
శాశ్వతమ్మైన నవవిలాసమ్ముతోడఁ
దరలియేతెంచి మృదుల హస్తములుసాచి
కడలిరాయని బిగియార కౌగలించు
ధన్య గౌతమికొనుము వందనశతమ్ము 1

కడుమోదమునఁదొల్లి కాంచియుందువుకదా !
కాకతీయుల యశఃకాంతసొగసు
వీనులకింపుగా వినియుందువుకదా !
విష్ణువర్ధనమహీవిభునికీవి
అంచితభక్తి నాలించియుందువుకదా !
అనఘు నన్నయభారతాంధ్రకవితఁ
జిత్తమారగపూజ చేయుచుందువుకదా !
భద్రాద్రిరఘురాము పాదయుగము
ఇన్నియుగములనుండి నీవెన్నడైన
స్వార్థరహితుండు నిర్మలస్వాంతుడైన
సత్పురుషునిఁ బరిమార్చ సాహసించు
జనుని కంటివె ? వింటివే ? జగతియందు

అంభోవధూటి నీ వవతరించుటచేత
నాసికాపురి మహిన్ వాసిఁగాంచె
అబ్ధిరాయునికి నర్ధాంగివౌ నినుమెచ్చి
రఘునేత నీదుతీరమున నిలచె
పతితపావనివీవు ప్రవహింపుచుంటచే
తెనుఁగుబిడ్డలకీర్తి దిశలకెక్కె
పూతవౌ నినుఁగాంచి పొంగి యీశానుండు
కోటిలింగాలుగా కోరి వెలసె
దృష్టికింపై తనర్చు నీ ద్వీపచయము
మధురఫలసస్యభరితమై మామకీన

హృదయవీథిని హార్ద్రోర్మ్మలెసగఁజేసి
భక్తిఁబొడమించునిరతమో భద్రగంగ! 3

ఘనుడగు గౌతముండు—త్రిజ
గన్నుతుడయ్యెను నిన్ను తెచ్చి పా
వన లహరీ మనోహరత
భాసిలుచుండెడు ఓ సవిత్రి! నీ
తనయుఁడ! వృద్ధికాముఁడ! స
తమ్మును నంజలిగూర్చువాడ —నా
వినతిని స్వీకరింపగదవే!
పరిపూర్ణ కృపాంతరంగవై 4

---

## తెనుఁగు బిడ్డ

చాళుక్యరాజన్య సామ్రాజ్య విభవమ్ము
భూతలమ్మున నిండి పోవునాఁడు
కాకతీయుల యశః కాంతా విలాసమ్ము
గగనాంతరాళానఁ గ్రాలు నాఁడు
శాతవాహనభుజా స్ఫాలనం బాసేతు
శీతా చలమ్ములన్ జెలగు నాఁడు
వేఁగిరాజుల మహో! భోగాంబురాసియం
దుండి రత్నమ్ములే పండునాఁడు

పల్లవాన్వయవంశ సంభవులు లలిత
కళల కాయువు వోయింప గన్ననాఁడు
వినుతి కెక్కిన నీపురాతన విభూతిఁ
దిరిగి చేపట్టగా లెమ్ము 'తెనుఁగుబిడ్డ' 1

మును కులోత్తుంగుండు తనకత్తిరుధిరమ్ము
గంగా తరంగిణిన్ గడుగు నాఁడు
కలగుండువడ వైరి కదనమ్ములో ఖడ్గ
తిక్కన్న రుద్రుడై తిరుగు నాఁడు
పులకేసి భుజబల స్ఫూర్తి కుఠారమ్ము
అరిమహీజమ్ములన్ దరుగునాఁడు
నాగమ్మ తల వాల్చి నలగాము బరిమార్ప
బాలచంద్రుఁడు కత్తిఁ బట్టు నాఁడు
భీతి నెరుగని విమల విఖ్యాతులైన
వీరకేసరు లుదయించి వెలయునాఁడు
వినుతికెక్కిన నీ పురాతనపు ఠీవి
తిరిగి చేపట్ట గాలెమ్ము 'తెనుఁగుబిడ్డ' 2

తెనుఁగు బాసకు వన్నె తెచ్చిన పూజ్యుఁడా
నన్నయ ధరణి యం దున్న నాఁడు
సన్నుతించుచు వాణి కన్నీరుతుడిచిన
పోతన్న జగతిపైఁ బుట్టు నాఁడు

వాణియే తన ముద్దురాణియంచు వచించు
పినవీరు డవనిపై మనిన నాఁడు
పారిజాత వినూత్న పరిమళమ్మును వట్టి
కోరి తిమ్మన ధాత్రిఁ గుప్ప నాఁడు
కలుష రాహిత్య మగు మహా కావ్యవితతి
కవుల హృదయాలలో పుట్టఁ గలుగు నాఁడు
వినుతికెక్కిన యట్టి నీ తెనుఁగుఁ దనము
తిరిగి చేపట్టగాలెమ్ము 'తెనుఁగుబిడ్డ,' 3

సమసిపోలేదు! నీ సాహసంబా ఓరు
గంటికోట ముఖాన కానరాక
వెడలి పో లేదు! నీ విజ్ఞాన మధుపమ్ము
గోదావరీ తల్లి కుక్షినుండి
పారి పో లేదు! నీ బాహా బలప్రౌఢి
పలనాటి బండలు పగులఁగొట్టి
ఊరుకో లేదు! నీ భేరీ నినాదంబు
జీర్ణ హంపీక్షేత్ర శిలలనడుమ
ధర్మమార్గానువర్తి మాధవునికీర్తి
వీడిపో లేదు! నీ జయవాడ నుండి
లేదు! పో లేదు! నీ శక్తి లేశమైన
దిగులు చెందకలేవోయి 'తెనుఁగుబిడ్డ' 4

# బ ం గా రు పి చ్చు క

ఉన్నత హేమడోళికల, నూగెడు రాజకుమారురీతి, న
త్యున్నత తాళభూజమున, నొప్పెసలారు పసిండి గూటిలో
కన్నకుమారకుల్, మగడు కన్నులపండువు సేయ నూగదే!
సన్నుతిఁజేతు నీ చరిత, స్వాగతమియ్యదె కొమ్మ, పిచ్చుకా! 1
వచ్చెడు వర్షకాలమున వాసముచేయగ తావులేమి, మా
పచ్చనిగంటి చేనుకొన భాగమునంగల తాడిఁజేరి, నీ
వచ్చట యిచ్చటం బడిన యట్టి తృణమ్ముల నేరి తెచ్చి, ఓ
పిచ్చుక! వైరిభీకర మభేద్య మనందగు గూడుకట్టితే! 2
తూరుపుకొండ కెంపురుచి తోఁపఁగమేల్కాని జీవితేశ్వరున్
కూరుకునుండి లేపి యెటకో! చని, యేరిన యీనెపుల్లలన్
జేరిచి, వంతనందక రచించితి విట్టి విచిత్రశిల్ప మీ
ధారుణియందు రోయ కలదా! యనిపించె మనమ్ము పిచ్చుకా 3
కాముకులై యిదంజనిని కాయము వొంపక, తామనమ్ముతోఁ
దామె కళామహోన్నతికి ప్రాణముసంగితి మంచు నిక్కుచున్
సోమరిపోతులై తిరుగు శుంఠలరీతినిఁ గాక, నీవు; ప్రో
ద్దామ పరిశ్రమన్ నెరపి దద్దయు నొప్పెదువమ్మ పిచ్చుకా! 4
గురువులేని విద్యలరయ వ్యర్థమటంచు
పలువురందురద్ది పాటి కాదు
గురువులేక తామె కఱచుగాదే! మీదు
కొలము నందుఁ బుట్టు వులుగులెల్ల 5

ప్రతిదినంబును హాంబట్టు పాన్పులందు
సరస సల్లాపములఁ దేలి సంతసమున
పసుపుకాంతుల నీను నీ బాలకులకు
ఆటపాటలు నేర్పదే! యనవరతము. 6

చాలప్రయాస జెంది జనసన్నుతి నందగ నర్హ రాలవౌ
నీ లలితంపునత్కళ, పునీతమటంచుఁ దలంచి నేర్వగా
జాలని మంద బుద్ధులట సన్యముగాయుచు, నీవు వచ్చుచో
గోలయొనర్చు చుండిరదిగో!, కనవచ్చెడు మంచెలెక్కుచున్ 6

సారస్వతాంబోధి సర్వదా మథియించి
చిత్రకావ్యమ్ములు చెప్పవచ్చు
చేతకుంచియఁ బూని చెలువ మొప్పారగా
మంచిరూపములు చిత్రించవచ్చు
జాతిబొమ్మలఁ గడు రమ్యంబుగా చెక్కి
శిల్పితలమ్మున ఖ్యాతిఁగాంచవచ్చు
కనకశలాకలన్ గాచి సాగగ దీసి
నగలల్లినత్కీర్తి నెగడవచ్చు
జిలుగు నూలును మగ్గాన చేర్చి దార్చి
నెర దుకూలములెన్నియో నేయవచ్చు
కాని, యీనెలతోడ నక్కజముదోప
చేయఁగాలేరు నీదు కులామమిట్లు 8

## ఆ మ ని

హాయిగనుండు భూజముల నన్నిటిఁ బట్టి కురూప మిచ్చి తాఁ
బోయెను ఫాల్గుణమ్ము, కసిపూనిన యట్లిదె! కీరశారికల్
కూయఁగఁడంగ, నేఁడు కడు కోమలరూపము తెచ్చి సృష్టికిన్
తీయని చైత్రమాస మరుదెంచి, ప్రమోదము చిందిపారగన్ 1

నిండుగళ స్వరమ్మున, వనీరమ పాడఁదొడంగె, పాటచే
నిండిన మోద్దులే కిసలయించెను నవ్యసుమాలతోడ, మా
ర్తండుడుత్తూర్పుకొండపయిఁ దార్కొనరమ్యసుమోచ్ఛ్రయంబు, క
న్పండువు చేయఁ జొచ్చెఁ, దరుణద్యుమణిద్యుతిమీఱె రోదసిన్ 2

పచ్చని కుంజముల్ దెసలఁ బాటలకాంతులనించె, చల్లగా
వచ్చెడు పైరగాలికి జవమ్మున తూఁగుచు నప్పుడప్పుడే
విచ్చెఁదొడంగె బండిగురివెందలు మల్లెలు బంధుజీవముల్
చెచ్చెరఁ బాడుచున్ విరులచేరిక నాడఁగఁడంగె భృంగముల్ 3

---

## వ్య ర్థ జీ వి

జీవితేశ్వరి మన నవజీవసుమము
వాడిపోయెను కటకటా నేఁడొ రేపొ
వికలమైపోవు ప్రేమజీవితఘటంబు
కనులుకుట్టిన మనుజసంఘమ్ము కులుక 1

బాల్యమునుండి యొక్కటే ప్రాణమనగ
కపటమెరుగని కూర్మితోఁ గలసిమెలసి
తలచు తలపులు గాలిసౌధమ్ములట్లు
కాలవాహినిలో సఖి! తేలిపోయె 2

నీతి నియమాలు నిరసించి భూతికొఱకు
ప్రాకులాడుచునున్నదీ లోకమిపుడు
కోటిరూప్యమ్ములర్పించి బోటినొసగ
ముదముతో సాకునో లేదొ; తుదకతండు 3

గుండెతడిలేని మానవఘూకములకు
వెగటుగాదోచె, ప్రేమజీవితఫలమ్ము
తమిని రుధిరమ్ము గ్రోలెడు దంశవితతి
కుసుమ సారంబెరుంగునే! బిసరుహాక్షి! 4

గగన గంగమ్ము నవిలాన గమనమునకు
హాయిలుగఁజూపును మనకథ లువిదమిన్న
కలికి నీముగ్ధ మోహానాంగమ్ముకింత
పాయనేరదు హృదయదర్పణమునుండి 5

ఆదటనిన్నినాళ్లు హృదయమ్మున నాటిన ప్రేమశాఖ వి
చ్ఛేదము సంఘటిల్లెను, నశించెను మోదము, ఖేదమింక న
న్నేదరిఁజేర్చునో తెలియదింతయు, నీహృదయమ్ముసాక్షిగా
రాదిక భూతకాలము, దురంతవియోగమె తథ్యమోప్రియా! 6

ధనికుల బిడ్డవీవనిక దా? నిరశించెనునన్ను సంఘ మో
వనజదళాయతాక్షి, తగవా యిది? ధనుఁడె విత్తవంతుఁడే
మనుజుడకే? దరిద్రుడిక మానవజాతికి దూరవర్తియై
వనములలో మృగమ్మటుల వర్తిలుటా! యిదిధర్మబద్ధమా? 7

తొలకరిమబ్బులో మెఱపుతో సమమైన విభూతికెంతయున్
గులుకుచు హృత్తలమ్మున నిగూఢముగా వెలుగొందు ప్రేమకే
విలయము తెచ్చిపెట్టిన ప్రవీణులు మానవలోకవాసులో
చిలుకలకొల్కి! యేమనివచింతును, ఖేదము నాట్యమాడెడిన్ 8

నిన్నతిప్రేమతో కనిన నీతలిదండ్రులు గుండెలేని సం
పన్నునకిచ్చి, భూరివిభవమ్ములఁ దేల్పఁ దలంచుచుండిరో
కన్నియ!, భావిజీవితవికాసముఁగోరని వారి చేతకున్
గన్నులనీరునింపక సుఖమ్ముగవర్ధిలు మావసుంధరన్ 9

ఒరులను దూరనేటికి తలోదరి పూర్వభవమ్మునందు నే
నెఱుఁగక యేమహాప్రణయి కెంతటిచెట్ట యొనర్చినాడ నో
సరసిజనేత్రి! కర్మఫలసంగతిఁ దూలనివాడెవండు, నా
దురిత మనంతమై యిపుడు త్రోచె నపారవిషాదవార్ధిలో! 10

కోకిలకంఠి! నాహృదయకోమలభావతరంగమాలకున్
ప్రాకటకాంతులన్ బెనుచు పద్మవిలోకవు, నీవులేని భూ
లోకసుఖమ్ములేల మృగలోచన! నీప్రణయానురాగమున్
భీకరకాననమ్ముల జపించుచుపోయెద వ్యర్థజీవినై! 11

చిగురుమామిడిక్రింద పగడాలతిన్నెపై
బాసచేసిననాఁటి హాసలవము
మందాకినీతీర మహిజంపుఛాయలో
చొక్కు-చుంగైకొన్న చుంబనమ్ము
కమనీయకాసార కల్హారదళములు
చెండ్లుగట్టెడునాఁటి చిత్తవృత్తి
మందారసహజాతి మాధవీకుంజాల
విహరణమ్ములనైన వింతచెలువు
స్మరణఁజేయుచుమామక స్వాంతమెల్ల
ననిశదుఃఖప్రవాహామధ్యమున భృంగ
కానగారాని యొకచిన్నిఫేనమౌచు
పోవుచున్నాఁడ చెలి వ్యర్థజీవినగుచు. 12

## దాత

వినువీధివిహరించు ఘనఘనాఘనములో
రాజిల్లుచున్న రిరమ్మదములు!
ప్రాక్సతీకుచకుంభ పరిరంభణముఁగోరు
బాలభాస్కరుకృపా భవ్యశోభ!
లలిత లతామతల్లులలోనఁ బ్రభవించి
మసలుచుండెడు మందమారుతములు!

అంధసృష్టికి మోద మందీయ నిశలందు
పరువులెత్తెడు నిశాకరునికళలు!
ధర కలంకారమై యొప్పు గిరిచయములు
జలధికౌగిట జేరునా సకలనదులు
వినయ గంభీరగతిని దీవింప, మనెడు
దాత యెవరన ? హాలికోత్తముడొకండె ! 1

ధరణి గర్భంబునందు గుప్తముగనుండు
అన్నమునుతీసి ప్రాణులకందచేసి
స్వార్థమెరుగక నిర్మల శాంతిఁదనరు
కర్షకునిసాటి దాత ! లోకమున నెవఁడు 2

మండుచుండ భువన మెండకాలమ్మున
శ్రమసహించి మేని చెమటలోడ్చి
తన్నుగొలుచునంచు దయబూని బహుగతిఁ
జేపుపంటలతని క్షేత్రలక్ష్మి ! 3

---

## పద్మినీకుమారి

పూజ్య మైనట్టి రసపుత్ర రాజ్యరమకు
గుండెయనవొప్పు చిత్తూరుకోటనుండి
ఏడువందల పల్లకీల్దోడరాగ
నిర్గమించెను వెస బద్మినీకుమారి 1

పోతుటీగకైన పోలయ నశక్యమౌ
సౌధరాజములను సంచరించు
రాణి నేఁడు తురకరాయుని చెంగటి
కేగవలసె నకట యేమనందు 2

పోరులోపల రసపుత్రవీరవరులఁ
దునిమి పద్మిని శీలమ్ము దోచుకొనగ
తలచివచ్చిన తురకభూధవుని కాళ్లు
చల్లబడిపోయె రసపుత్ర శౌర్యమరసి 3

సామమునఁగాని మోసము సాగదనుచు
సంధి మిషచేత పద్మినీ సతినిఁగాంచి
గౌరవార్థము వెనువెంట కదలివచ్చు
భీమసింగును బంధించె వెడగుతురక 4

రాజసముదొరంగి రాణినర్పింపుడు
కాకయున్న నృపుని కంఠమూడ్తు
ననుచు వార్తనంపె నల్లాయుదీనుండు
క్షాత్రవరులగుండె జలదరింప 5

రాణి నీయందు బద్ధానురాగ యగుచు
శిబికలం దెక్కి వేలాదిచెలులతోడఁ
బయనమైవచ్చు ననువార్త పంపిరపుడు
రాకుమారులు తురకకు ప్రమద మెనగ 6

అందలమ్ములు శరవేగమందిసడచి
చేరుకొన్నవి సుల్తాను శిబిరములను
పొంగిపారలెడు మోదతరంగ తతులఁ
దేలిపోవుచు తన్నుతాఁదెలియకతడు 7

సరగున సుందరి శిబికకు
తెరవెడలిచి యేమికనెనొ తెలతెలపోయెన్
తరళాక్షి కానరాదొక
శరహస్తుండైన మేటిక్షత్రియుడుండెన్ 8

సహజసౌందర్య నవవిలాసమ్ము చిలుకు
తోయజాక్షికి మొదురేగు తుఱకవిభుని
మేననాటెడు మరునిప్రసూన వితతి
క్షణములో ముంచె ఘోరాస్త్రజలధిసడుమ 9

మోసము! మోసమో! యని చమూపతులన్ బురికొల్పె, భూ
పుఁ డాయాసముతోడ నయ్యవనులార్చి,హుటాహుటి నాయు
ధమ్ములన్ దీసిరి, యింతలో ససమధీరులు నా రసపుత్ర కేసరుల్
భాసురవిక్రమోద్ధతి నపారముగా చెలరేగి రెల్లెడన్ 10

కొందఱు ఖడ్గహస్తులయి కొందఱు భూరి కుఠారధారులై
కొందఱు శూలపాణులయి కుంభినియానినదంచు శాత్రవుల్
కొందలమంది పారగ నకుంఠితసాహసమొప్పునట్లు మ
ర్ద్యందిన చండభానుని విధమ్మున వెల్గిరి యాహవమ్ములో 11

రాజుచెలఁబాసె నసమాన తేజమెసఁగ
నాలమొనరించె రెండవ శూలిపోలె
కాని; ఫలశూన్యమయ్యె నఖండ శత్రు
వనధి దిగమ్రింగె; రసపుత్ర వాహినులను 12

ధర్మసంగ్రామరతులు స్వాతంత్ర్యప్రియులు
సాహసోదార చరితు లుత్సాహపరుల
కపజయంబయ్యె యవనుల కబ్బె జయము
సాధ్యమగు నొక్కొ విధివిలాసమునెరుంగ 13

ఆలమునందు పూర్ణవిజయమ్ము గడించిన పెద్దపెద్ద దా
డీల తురుష్కవీరు లతిశీవిమెయిన్ గొలువంగనేగె, నా
యేలిక; దుర్గమధ్యమున నింతులు కానఁగరారు క్రేవనే
గోలయు వీతిహోత్రుఁడు ఖగోళమునంటి వెలింగెపెల్లుగన్ 14

రాకుమారుల మరణవార్తావిధమ్ము
తెలియవచ్చిన పద్మినీదేవి తనదు
నెచ్చెలులపిండుతోకూడి చిచ్చుఁజొచ్చి
మానసంరక్షణార్థమై మేనువిడిచె 15

ఏ మహాసాధ్విపైగల కామమునకు
బలియొసంగెను వీరులతలల వెన్నొ
ఆమహాసాధ్వి! సాహసంబరసి తుఱుక
కనులనీరిడి ఢిల్లీకి కదలిపోయె 16

పద్మినీకుమారి భౌతిక దేహమ్ము
కాలగర్భమందు కలసిపోయె !
కాలగర్భమందు గారాడుపుడమిపై
చెలువ సద్యశమ్ము నిలచిపోయె ! 17

---

## దివ్య వాక్కు

నే నొకనాఁడు రేపకడ నిద్దురమేల్కొని నాఁటికృత్యమున్
ధ్యానముచేయుచున్ మది, సదా! చనురీతిని చద్దిచిక్కమున్
బూని, హుటాహుటిన్ నడచిపోయితి మాపొలిమేరచెంగటన్
గానగవచ్చు యేటికడ గట్టున మామిడితోటలోనికిన్ 1

గాలితాకున నేలపై రాలియుండు
పండ్లకై నేను దశదిశల్ పారఁజూడ
రేయియెండకు నాతరుచ్ఛాయలందు
కానరాదయ్యె! నొకచిన్నికాయయైన 2

ఏమియుపాలుపోక నిదురించుటకున్ మది నిచ్ఛలేక, యా
మామిడితోటలో చిగురుమామిడికొమ్మను బోనముంచి శే
కామిని పోయగన్మనకుఁ గౌతుకమందుచు చూచుచుండగా
యామినిబాంధవుండు చరమాద్రినిచేరె, క్రమక్రమమ్ముగన్ 3

పొడుపుగుబ్బలి లోయలుగడచివచ్చి
వెలుఁగఁజొచ్చెను మింటిపై వేగుచుక్క
గగనకళ్యాణి ఫాలభాగమ్మునందు
తీర్చిదిద్దిన సిందూరతిలకమనఁగ 4

అంతట తెల్లవారుసమయంబగుటంగని తారకల్ దివిన్
వింతగ దారజొచ్చినవి విత్తవిహీనుని భృత్యులట్లు, భా
స్వంతుఁడు మెల్లగా నరుణపాదములన్ నిగుడించుచుండగా
సంతసమంది ముద్దుగొనె! సారసబాల ప్రహృష్టచిత్తయై 5

రేయిని చెట్లపైన నిదురించెడు సర్వశకుంతజాలముల్
గూయఁగడంగె లేచి, తరుకోటరముల్ వెసజొచ్చె ఘూకముల్
కోయిలగాయకుండు తన కోమలకంఠముతోడ హాయిగా
తీయుచునుండె రాగములఁ దీయనిమావిచిగుళ్లు మెక్కుచున్ 6

అక్కజమెసగంగ ప్రకృతి
చక్కదనమ్మరసి పరమసంతోషముతో
చుక్కల నిర్గమనముగను
చొక్కగడియ సేపు మరచియుంటి నిహమ్మున్ 7

చెంగటంగల మాదొడ్డిచెలకలోన
లేచి నిలుచున్న గోమాత లేగదూడ
తనువువిదళించి యార్చుచు జననితోడఁ
బలుకజొచ్చిన దీరీతిఁ బ్రస్ఫుటముగ 8

"మాత నే నుద్భవమ్మది మానవమయ్యొ
కాని నిరతమ్ము మనయజమాను డకట!
పూర్తిగాపిండు పాలొక్క-పూటనైన
కుడువగానీయ డెంత కర్కోటకుండో! 9

మానవాకృతి కలదను మాటెకాని
దయయు సత్యము యీతని తనువులోన
లేవు లేవమ్మ కన నొకలేశ మైన
నుండిమేయున్న న న్నేలయెండ బెట్టు 10

తనకుటుంబమింట ననురాగమున సదా!
పెరుగుకొఱకు పాపభీతివిడచి
ప్రతిదినమ్మువచ్చి పాలుపిండుకపోయి
నన్ను మాడ్చి చంపుచున్నవాడె? 11

లలితసుమనోజ్ఞ మధురశాద్వలములుండు
వనుల మేయుచు సెలయేటివాగులందు
నీరమునుగ్రోలి స్వేచ్ఛపెంపార, మనక
యిట్టి దౌర్భాగ్యజీవన మెందుకమ్మ 12

చూడు ముప్రొద్దులిట్లు కట్రాడులందు
మనల బంధించి మాడ్చు దుర్మార్గుడింక
మొండిగావచ్చి నీపాలు పిండునపుడు
శృంగములతోడ గుండెలు చీల్చరాదె?" 13

అనుచు పటురోషమునఁబల్కు తనదులేగ
పలుకులాలించి ధేనువు కలతపడక
శిరము వంకించి యోచించి కరము వినయ
మధురవాక్కుల నీరీతి మందలించె 14

"కలువమిత్రుని తేజమ్ము వెలయ నాదు
గర్భమున పుట్టినట్టి బంగారుకొండ!
నీవుచెప్పినదంతయు నిజమె; కాని
స్వార్థజీవితమెంత నిస్సారమోయి! 15

ధరణి నుత్తమజన్మంబు దొరకుటరుదు
దొరకినప్పుడు తనస్వేచ్ఛకొఱకె దాని
వ్యయముచేయుచు వేయేండ్లు బ్రతికియున్న
ఫలముశూన్యంబు మఱియు జీవనము భరము 16

చేరి నాయూధమునగల్గు క్షీరమెల్ల
నీవె కడుపారగా గ్రోలనెంచి యొకని
చీల్చి చెండాడుమంచు వచించుచుంటి
వింతకన్నను ద్రోహమింకెందు కలదు 17

ధరణిఁబుట్టిన యీ చరాచరము లొరుల
క్షేమమున కెప్డు తనువు త్యజింపవలయు
నెరుగవే? తండ్రి! మహిఁ బరహితము పొంటెఁ
పాటుపడనట్టి జన్మ నిష్ఫలమటంచు 18

అరయఁగాలేదె? నిన్నమధ్యాహ్నవేళ
పిక్కఁబలసిన మనరైతు దుక్కిటెద్దు
చక్కఁగా మేసి శయనించి యక్కజముగ
వాతరోగమ్ముచే మేను బాసె నిందె! 19

నీ యవివేకవాక్కులు గణించుచు నీతని హత్యచేయు ట
న్యాయముకాదె? చిట్టితనయా! త్రిదివమ్ము లభింపవద్దె! దీ
ర్ఘాయువుతోడ నిమ్మొయివసింపదరమ్మె? యేరికిన్
గాయము శాశ్వతమ్మె? చిరకాలము నిల్చునె? వెంటవచ్చునే?" 20

అనుచు గోమాత పట్టికి వినుచువాక్కు
లాలకించుచు నే లేచి యావుదూడ
బంధములనెల్ల సడలించి పాలుకుడిపి
తిరిగివచ్చితి కొండంత తెలివితోడ! 21

---

## ప్రేయసి

తాళుము తాళుమటందువు
బాలా? యిట్లెన్నినాళ్లు ఫలరహితముగా
కాలమ్ము వ్యర్థపుచ్చుట
జాలము విడిలెమ్ము కుసుమసాయకు గొలువన్ 1

చల్లనిపిల్లవాయువులు సాగుచుఁబోయి లతాగృహాలలో
మల్లియపూలబాలికల మానస వీధుల కేళిసల్పె, శో
భిల్లె! చకోరదంపతులు ప్రేమసుధాంబుధి తేలియాడి, నీ
నల్లలితాధరమ్ము రభసమ్మున నానగనిమ్ము, ప్రేయసీ! 2

యామిని మీఱుచుండె, గగనాంతరవీధి వెలుంగుచుండె, రే
భామిని ప్రాణవల్లభుఁడు భవ్యమహోన్నత నవ్యరోచితో!
కాముని పుష్పబాణములు గాయము చేసెను నాయెడంద నో
కోమలి! సైపజాల నిదిగో, కరుణించి తరింపఁజేయవే! 3

పాయనివేడ్క నీ ప్రణయ బాలరసాలమునందు రేఁ బవల్
కూయగడంగె నాయెడద కోయిలయై, దగఁ జెందె ప్రేమయున్
దోయమువోయకుండిన నధోగతి పాలయిపోవు; నంత నీ
హాయి లభింపబోదు పరిహాసముకాదిది లెమ్ము ప్రేయసీ! 4

ప్రాయమువోవదింతనని భావమునం దలపోయుచుందు, వో
తోయజగంధి! యీవయసుతో లభియించిన ప్రేమసౌఖ్య మా
ప్యాయన మొప్పఁజెందక, భవాదృశులెవ్వరు వీడజూతు రీ
కాయమశాశ్వతమ్మని జగమ్మున ప్రాజ్ఞులు పల్కుచుండ రే? 5

పంకరుహానేత్ర! లెమ్ము నీ ప్రణయ మధుర
రాగ రసపూర్ణమా నధరమ్ము గ్రోలి
కాలవాహినిలో బడి తేలకిట్లు
కూరుచుండినచో కోడికూయు నేమొ! 6

---

## తీయనితలపులు

అలరులవింటివాడు కుసుమాస్త్రతతిన్ వెసఁజిమ్ముచున్న యీ
లలిత వసంతవేళ కిసలంపుఁబటమ్ములు కట్టి హాయిగా
కులుకు నికుంజకామినుల క్రోడతలమ్ములఁ జొచ్చి కేళికల్
సలిపెడు తేఁటినోచు సుమసారముగ్రోలదలంతు సర్వదా! 1

భీష్మమైతనర్చు గ్రీష్మాతపమ్ములో
శ్రమమునైచి భూమి సాగుచేయు
కర్షకాళి మేని ఘర్మాంబువులు రాల్చు
మలయ పవనునందు కలియునెంతు 2

భూమి సమస్తసస్యఫలపూర్తిని వెల్గెడు శ్రావణమ్ములో
సామజగండపాళి మదషట్పదరోచులు మించగా మదిన్
తామసమూని యేగుజలదమ్ములనెక్కి వియత్పథాలలో
నేమముతో జరింప మది నిచ్చలుపొంగు నిదేమి చిత్రమో! 3

---

## నేను

సరస సంగీత సాహిత్య ఝరులమునిగి
సత్యధర్మాది ధౌతవస్త్రములు కట్టి
విశ్వమానవ కళ్యాణ వేదిమీద
వెలయుమూర్తుల సర్వదా! కొలుతునేను! 1

పుడమి పులకింప తోయధుల్ పొంగిపార
భవ్య సాహిత్యమహిజాల పై చరించు
కవిపికమ్ములఁ జేర శాఖలనుపట్టి
ప్రాకులాడెడు కవికుమారకుడ నేను 2

కాకతీయుల సద్యశఃకాంతిలోన
కృష్ణరాయని నిర్మల కీర్తిలోన
మునిగి తేలుచునున్న యీ తెనుఁగు నేలఁ
బొడమ గన్నట్టి కీర్తి కాముఁడను నేను 3

నవరసోల్లసితమ్ములై నవ్యభావ
భరిత సత్కావ్యసూనాలు భక్తి మీఱ
భారతీదేవి తురుములో పదిలపరచి
గడన కెక్కిన దాన దాసుడను నేను 4

కలుషదుర్దాంత పంక సంకలిత మగుచు
ధర్మ సత్యాదుల కొకింత తావులేక
శిథిలమైయున్న మానవజీవితములఁ
దిరిగి మేల్కొల్పు పూజ్యుల కెరగుచుందు 5

భక్తిదై వార స్వాతంత్ర్య భండనమున
ప్రాణబలిదాన మొనరించి పరముఁ గొనిన
వీరలోకాని కెల్ల జోహారు లిడుచు
మోద వారాసిలో తేలిపోదు నేను. 6

---

## పండిత బాబు

ఎవ్వాని భావాగ్నులెగసి దిక్కులఁ గ్రమ్మ
రమణీయ ఢిల్లీ పురమ్మునుండి
ఎవ్వాని విఖ్యాతి యే సదా! నినదించు
చెలువొప్ప నాసేతు సీతగిరుల
నెవ్వాని సాహసం బెరిగి గూడలు క్రుంగి
లొంగె నా నైజాము దొంగతురక
ఎవ్వాని వాక్ప్రౌఢి కెదురు నిల్వఁగలేక
పోయిరా యింగ్లాండు ధీయుతాఢ్యు
లెవని సముదార చిత్తమ్ము నెంచి చూడ
జలధి కెనయౌను భావ వైశాల్య గరిమ
నట్టి ధీశాలి జవ్హరుం డరసి చూపు
తెరువు వీడకుడో! భారతీయులార! 1

పిత్రార్జితమ్మైన విత్త మంతయు దేశ
మాత కర్పించిన మహితయశుఁడు
కోటీశ్వరుండైన మేటి మోతీలాలు
ప్రాగ్జన్మ కలిత తపఃఫలమ్ము
సత్య మహింసయున్ శస్త్రముల్ గా గొని
చెలువుగాంచిన గాంధి శిష్యవరుఁడు
తన బహిఃప్రాణమైమను కులాంగన వోవ
ధృతిక్రుంగిపోని సుధీనుతుండు

స్వప్నమునన్నైన సత్వమ్ము జారనీక
పోరుసల్పిన యట్టి భగీరధుండు
భవ్య భారత రాజ్యాంగ భాగ్యరమకు
గుండెయే సుండు జవ్హారు పండితుండు 2

---

## అ ర వి ం ద యో గి

సకల భాషాజ్ఞాన సంపత్తి మూర్తిలో !
ప్రసరింప వెల్గిన రమ్య యశుఁడు
ప్రతిలేని స్వాతంత్ర్య భండనమ్మున దూకి
రాజిల్లినట్టి హార్యక్ష విభుఁడు
తనలోన వెలయు నంతర్వాణి యుద్బోధ
శిరసావహించిన కరుణమూర్తి !
వేదాంతవీధిలో! వెలయు శాశ్వత శాంతి
పూని కన్గొనినట్టి మౌనివరుఁడు
కలుషదుర్దాంతపంక సంకలిత వసధి
మసల విడనాడి యేలోకమునకుఁ జనెనొ
తిరిగిచూడకయే! భారతీయులార !
విమలచారిత్రుఁడౌ "నరవింద యోగి"

## ర సా ల ము

సొగసాలికించు నీయిగురు
    సోయగమున్ దిలకింప చేరుచో
దిగి యిటులేగు దెంచు చిరు
    తెమ్మెరలన్ నినదింపు చేదియో
తగ వినరాని వాక్యము సదా!
    నినదించెడి నోరసాలమా
పగలును రాత్రియున్ వెడలు
    పావన వాక్యమదేమొ! తెల్పవా?

---

## బా ల్య స్మృ తి

స్మరణ కెలయింతు నాదు శైశవమనోజ్ఞ
చేష్టలరయుచు పరిపూర్ణ చిత్తమందు
ప్రేమ పొంగార బంగారు పిచ్చుకనుచు
తనువు నిమిరెడు పూజ్య మాతామహుండు
గారవముమీఱ తనదు అంకమునఁ జేర్చి
లలిత లాలిత్య మధురసూక్తు లురహింప
ప్రతిదినమ్మును దివ్య పురాణకథలు
నూరిపోసిన యమ్మహాసూరి నేడు

కానరాదేల ?

భువనాలు కలయజూచి
విసివి వేసారి తతని యన్వేషణమున
ఏమహాపథగామియై యేగినాడొ !
ఏమహోన్నత రమణీయ సీమయందు
తన నివాసమ్ము నెలకొల్పుకొనినవాడొ ! 1

ధరణినున్నప్పుడతని హృత్తలమునందు
పొంగి పొరలెడు భావతరంగములకు
పసిమి దిద్దెడు బాలార్క ప్రభవవేళ
పంచపాత్రయు నుదకమందించునపుడు
కరుణకురియంగ తనదు చెంగటికిఁ జేరి
పంగనామాలు నుదుటను చెంగలింప
బుజ్జగింపుచు ననురాగ ముట్టిపడగ
మమతఁజూపిన యమ్మహామహు చరిత్ర
మరువ తరమౌనె! యెన్ని జన్మాలకైన ! 2

---

## గో మా త

చేతమలరగ భువనములలో
ఖ్యాతిఁగాంచియు సాధుగతి సం
ప్రీతితో మమ్మేలు నిను నుతిఁ
జేతుమో మాతా ! 1

నీదుక్షీరము నీకరీషము
నీదుమూత్రము జగతియందు పు
నీతమై యలరారి మహిపై
నెగడు గోమాతా! 2

నీమహాత్మ్యంబెన్నగా నల
తామరసగర్భునకు వశమా
కామితార్థములిచ్చి సతతము
కావుమో మాతా! 3

తల్లిఁబాసిన నిసుగులెల్లరు
చల్లనగు నీపాలచే వ
ర్ధిల్లుచుందురు నీదుత్యాగము
దివ్యమో మాతా! 4

మూగతనమున సర్వదా! యే
భోగముల నాశింపునెరుగని
త్యాగమూర్తివి నిన్ను మదిలో
దలతుమో మాతా! 5

కారుమేఘము లాకసమ్మునఁ
జేరుకొని వర్షింప పెరిగిన
పూరినే భక్షించి తృప్తిని
పొందుచుండెదవా? 6

కర్షకా ! గోపాదరజమును
శీర్షమునసిడి సేవఁజేసిన
హర్షమందుచు మేరుశిఖర
మ్మందగలవోయీ ! 7

బుద్ధ దేవుం డుదయమందిన
భూమిలో జన్మించి యుంటివి
బద్ధకంకణమూని గోతతి
బాధలుడుపుమురా ! 8

నవ్యభారత దేశమందున
భవ్యమగు నీమానవత్వము
సవ్యముగ గుఱుతించి ముందుకు
సాగిపోవోయీ ! 9

కదురుకవ్వంబాడినపుడే
సదమలమ్మగు ప్రాజ్ఞహాస్సులు
విదితముగ ధరణీతలమ్మున
వెలయగలవోయీ ! 10

---

## స రో జ ని

భారతీయకళావనమ్మున
బాలసహకారాగ్రమందున
కేరిపాడిన పరభృతమ్మును
జారవిడిచితిరా! 1

పిలుపుకందక పారిపోయిన
కలతవడి దురపిల్ల లేశము
ఫలముకలదే బలముకొలదీ
పరుగుతీయండీ! 2

ఖండఖండాంతరములందు న
ఖండఖ్యాతి గడించి భారత
ఖండ సభ్యోన్నతిని చాటిన
ఘనమనీషినిరా 3

వంగ వంగడ ప్రాభవమ్ము తె
నుంగుగడ్డకు తెచ్చి కవితా
రంగమే యుప్పొంగ వెలసిన
రాజముఖిసుమ్మా 4

అతివలబలలటన్న వాక్యము
మతివిహీనులమాట లేయన

ధృతిని స్వాతంత్ర్యాహవమ్మున
దుమికిమించిన సాధ్వీరా 5

ఘోరకారాగారములలో
దారుణపు హింసలకునోర్చుచు
ధీరతను విడనాడి యెరుగని
వీరనారిసుమా 6

ఆమె సత్కవితామనోజ్ఞత
కాంగ్లకవులే వెరగుచెందిరి
సీమలెన్నో సమ్మదముతో
శిరము లొంచెనురా 7

ఆమె సుగుణాక్షతలు భారత
భామినులు శిరసావహింపుచు
ధీమహత్త్వముచాటి భారత
దేశసేవ యొనర్పుడీ 8

---

# ప్రేమభిక్ష

నిండుపున్నమనాఁటి రేయిని
పండువెన్నెలనీట ధరణీ
మండలము జలకేళిసలుపుచు
నుండె వేడుకతో 1

అది మనోహరమైన యమునా
నది సమీపవిలాసవనమం
దుదయమయ్యెడు మలయపవనుని
ముదము నేమందున్ 2

చెంగుచెంగున దుముకుయమున త
రంగరావమృదంగముల కు
ప్పొంగి తేఁటులు సల్పు గాన వి
భూతి నేమందున్ 3

మెల్లగా వాహ్యాళి సలిపెడు
పిల్లగాలులుసోకఁ హృదయము
తల్లడిల్ల చరింపుచుండిన
తరుణి యెవ్వరొకో ! 4

హాయిగా! యీ వనవిహారము
చేయుటకుఁ దగు హేతువేమో!
రోయు చున్నది మాటిమాటి కు
పాయ మదియేమో! 5

యామినీ విభు ధవళ రుచులా
కోమలాంగిని సోక కనలుచు
నేమియో తలపోయు చోకయెడ
లేమ నిలుచుండెన్ 6

నీపశాఖల క్రింద మిక్కిలి
యేపుగా పెరిగిన నికుంజము
చూపులకువిందై రహింపగఁ
జూచి వడిఁ జొచ్చెన్ 7

చొచ్చి యానవపల్లవాధర
తెచ్చిపోసిన జాజిపూవులు
గ్రుచ్చి మాలగ నేర్పుతో తన
కోర్కెలుప్పొంగన్ 8

ఆతురతతో మాల కట్టిన
చేతులే యెఱుపెక్కిపోయిన
వాతలో దరిస్వాగతముఁగొను
పూతుడెవ్వండో! 9

చిచ్చు వలె చంద్రాతపమ్ములు
హెచ్చిపోయిన వంతకంతకు
మచ్చరముతో కైరవమ్ములు
విచ్చినవ్వినవి 10

మోహమా రేకెత్తుచుండెను
దేహమా ముచ్చెమట పోసెను
యూహలెన్నో మొలకలెత్తిన
వువిద చిత్తములో 11

భావజుని సితసాయకమ్ముల
బారివడి యపు డమ్మృగేక్షణ
భావమునఁ దలపోసి యేవో!
పలికె నీ రీతిన్ 12

"ఎంతద్రోహం! ఎంతద్రోహము!
కాంతుడియ్యెడ కరుగు దెమ్మని
పంతమున శపథములు పలికియు
పాడిఁ తప్పెకటా ! 13

అలరుఁబోఁడుల నమ్మరాదని
పలుకుచుందురు పురుషులెన్నక
చలితచిత్తులు యెవ్వరోయిట
స్పష్టమయ్యె కదా! 14

తావొసంగిన సుమరసమ్మును
త్రావిపోయెడు భృంగములగతిఁ
దరుణి హృదయంబందు కొనిచని
తిరిగి చూడరుగా ! 15

పలుకు తేనెల కలరికట్టా!
భ్రమసి నేనే! మోసపోయితి
పసులకాపరి యెరుగు నొక్కో
ప్రణయ మహిమంబున్” 16

కలికి వేదనఁ గాంచుచుండిన
అలరులన్నియు మధు కణమ్ముల
జలజలా మహిరాల్చె వేదన
బయలు పడ నంతన్ 17

సరిలేని తనచేతి మురళీ స్వనమ్ముచే
ప్రాణికోటిని మోహపరచు వాఁడు
కమనీయ కువలయ కళకు పోడిమిదిద్దు
మైచాయగల వేల్పు మంత్రకాఁడు
ప్రళయకాలమునందు పాల మున్నీటిలో
తేలియాడిన ముద్దు బాలకుండు
సతతమ్ము కాళింది సైకతస్థలులందు
పశులఁ గాపాడు గోపాలకుండు

బ్రహ్మబ్రహ్మంబు మౌళిపై బరగువాఁడు
మౌనివర్యుల హృదయాల మసలువాఁడు
అవ్యయానందసీమలం దలరువాఁడు
కానగావచ్చె సుదతి కాకస్మికముగ 18

ఝల్లుమనె నా బాలగుండెలు
ఘల్లుమనె మంజీరయుగళము
మల్లెపూబాలికలు సైతము
తెల్లబోయినవి ! 19

నీరజాక్షుఁడు రాధికా? యనె
నీరుక్రిమ్మెను రాధ కన్నుల
వారిజోదరు డాదరమ్మున
జేరి తీయని నుడులతో 20

"లలన నాపై యిట్టు లలిగిన
నిలువఁదరమా నిముసమైనను
కలికి నీ యనురాగరసమును
చిలుకవే కరుణన్ 21

తరుణిరో! యిపుడీవు వైచిన
దండనకు బద్ధుడ నవశ్యము
అలుకవీడి విధింపు వేగిర
మనుభవించెదను 22

జాజిపూపొదరింటిలోపల
రాజవదనా ఖైదుచేతువా
మోజుగా విరజాజికోలను
మోదకోరెదవో !” 23

“ఎంతపాపిని! యెంత పాపిని!
ఎరుగకెన్నో దూరియుంటిని
పంతమున భవదీయహృదయం
బరయలేకుంటన్ 24

అక్షయంబగు ప్రాణికోటిని
పక్షపాతము లేక బ్రోచెడి
దక్షు నిను శిక్షింప నెంతటి
దాన నేకృష్ణా ! 25

అరమరలు కనరాని ప్రేమను
కురియుచీయమునాతటమ్మున
నిరత మనురాగాబ్ధిఁదేల్పుము
కరుణతో కృష్ణా’ 26

వారి నిర్మలప్రేమ కాంచెను
తారకాక్షులు విప్పిగగనము
సారసుధవర్షించె కౌముది
భూరి హర్షముతో ! 27

కలకల ధ్వనిమాని యమునా
లలనకాంచి పునీతయయ్యెను
కులికి సుమములు చిగురుముసుగులు
తొలగనవ్వినవి ! 28



రాయల ముద్రణాలయము, తణుకు—ఆగస్టు, 1951.

## వాణీ కావ్యమాల:



చిత్రవాణి (ప్రథమభాగము) రు.
చిత్రవాణి (ద్వితీయభాగము)
రామభూపాలశతకము

అచ్చులో:

సంయుక్త
కుసుమగుచ్ఛము

ప్రకాశకుడు:—

పెన్మెత్స రాజంరాజు.
చోడవరము.
(వయా) భీమడోలు, ప.గో.జిల్లా.